ఆర్యులారా,                విజ్ఞాపన!!

అఖండ విభూతిదాయకంబైన భరతఖండమున హేమగిరికి యామ్య దిగ్భాగంబునను శ్రీగిరి కీశాన్య భాగంబునను మిగుల ఘనతవహించినటి నైజాంరాష్ట్రమందు నల్లగొండజిల్లా సూర్యాపేట తాలూకా బేతవోలు గ్రామమందు మహారాజ రాజశ్రీ తడకమళ్ళ సీతారామచంద్రరావు దేశముఖు దేశపాండ్యా ముఖ్తెదారుగారి దర్మకర్తృత్వపాలనలో వర్షపర్వతాగ్రస్థితుండైన శ్రీకోటీశ్వరస్వామివారి కంకితంబుగావించి సమర్పించిన శ్రీకోటీశ్వరశతకమును చదివి సంతసించ గలందులకు రసికులగు భక్తబృందమును ప్రార్థించుచున్నాను.

ఇట్లు సకలసుజన విధేయుడు,

ఈశ్వరప్రగడ నృశింహారావు.



శ్రీ.

శ్రీసద్గురుభ్యోనమః.

## శ్రీ విఘ్నేశ్వర ప్రార్థన.

మ. గిరిజానందన లోకపాలన మహాగీర్వాణ సంసేవితా
వరదా భక్తభయాపద్రిదాయక కృపావారాశి నా సత్కృతిన్
నెరవేర్చంగలవాడవంచు నెపుడున్ నిన్నే మదిన్ గొల్చెదన్
గిరిజానందన యో గజానన మహాకీర్తిప్రతాపోన్నతా.

## శ్రీ సరస్వతీ ప్రార్థన.

చ. కంజజురాణి భక్తజనకామితదాయిని నీపదద్వయు
క్కంజలి జేసి మ్రొక్కెదను నాదరమొప్పగ నాదువాక్కులన్
రంజిలజేయు నీమహిమ రాజశిఖామణి దెలియనేర్చునే
మంజులవాణి వాణి సురమాన్యశిరోమణి దేవిభారతీ.





శ్రీ

# శ్రీ కోటీశ్వర శతకము.

---

మ॥ శ్రీమత్సర్వ జగత్స్వరూపవిబుధ శ్రేణీనుత ప్రాభవా
కామక్రోధ మదాద్యరిప్రకర శిక్షా దక్షసద్రక్షకా
భూమానంద మరందసంభరిత హృత్ఫుల్లాబ్జ లోకేశ్వరా
శ్రీమద్బైతనవోలువాసహర గౌరీనాథ కోటీశ్వరా॥ 1

శా. నీసేవల్ స్తుతులున్ నతుల్ గృతులు నిర్ణిద్రప్రభావంబుచే
రాసన్ వర్ణనచేయ బూనుటకు నామ్నాయంబులే క్రిందుమీ
దైసాధింపగలేక యుండ నిక మాకా చెప్ప బన్నేరసా
భాసంబాటక కాక నేమయిన నీ భారంబె కోటీశ్వరా॥ 2

మ. కవితామాధురి మెచ్చి భూధవులు సత్కారంబులన్ జేయగా
దవనిన్ బండితు లీరసజ్ఞతకు వహ్వాయంచు శ్లాఘించి గౌ
రవమున్ గూర్పగ గాదికేమన ముఖ పరిత్రాళనారంబు నీ
స్తవమున్ బద్యశతంబుగా సలుపనిచ్చలె పుట్టె కోటీశ్వరా

మ. సరసంబంచు విలాసమంచు ముదవే జాతుర్యమే సాగఁగ
క్కఱఁ మాలినబూతుపద్యము లజస్రంబుఁ బ్రస్తుతింబుగా
దొరలుఁ దాతలమెప్పుకోలునకు నెంతో నోరుపాడ్సేయు కం
టెరసజ్ఞత్వమటంచు జెప్పితిమి నిన్నే నమ్మి కోటీశ్వరా! 4

మ. రసమెట్లున్నను లక్షణంబుననో శాస్త్రంబందో భావోక్తినో
దోసగుల్ చాలబోసంగవచ్చునయినన్ దోషఘ్ను మానీ స్తవ
ప్రస్మృతిన్ దాబరు సంబునన్ గలసి స్వర్ణంబైన లోహాస్థితి
బసగాంచున్ గటయుక్తీంద్రము శుచత్వంబంది కోటీశ్వరా

శా. అంతో యింతయొ గానమో కవనమో యభ్యాసమై సజ్జన
స్వాంతంబుల్ చిగురింప నీస్తుతిరసాస్వాదంబుగా గూర్చి ని
శ్చింతన్ గాత్రము జంత్రమున్ గలిపి దృష్టిస్నిసహాబ్జంబులన్
గంతుల్ వేయగ బాటబాడనిక జన్మంబున్నె కోటీశ్వరా 6

శా. ఓకల్యాణగుణాకరా పురహరా యోభక్తసంరక్షకా
యోకారుణ్యమయస్వరూపవరదా యో దైత్యవిధ్వంసకా
యోకంజాప్తశశాంకవహ్నినయనా యో మోక్షసంధాయకా
యో కైలాసనివాస దోషహరణా యో దేవ కోటీశ్వరా 7

శా. దైవోత్తంసుడవంచు భక్తజనసంత్రాణుడవంచున్ కృపా
భావంబున్ వెలిబుచ్చువాడవనుచున్ బల్మారు నీభక్తులున్
గైవారంబులుసేయుటంగని నిక్కంబంచు ధైర్యంబునన్
దేవా నిన్నదనమ్మి నిత్యమునుభక్తిన్ గొల్తు కోటీశ్వరా 8

మ. జగమున్ పద్మముపుట్టి నీహృదయకాసారంబునన్ దానినా
నిగమంబుల్ నిగమాంతముల్ విరిసి తేనెల్ వ అభృంగాళినా

దగునీభక్తగణంబు తన్మధువుగాస్థన్ గ్రోలినీనామ మిం
పుగనానంబొనరించుకంటె గలదేపుణ్యంబు కోటీశ్వరా॥ 9

మ. ప్రకృతిప్రాభవహేతుభూతమగు దివ్యచ్ఛక్తిన ర్థాంగమం
దకలంక ప్రతిభన్ ధరించి తగనిర్వ్యాజానుకంపామతిన్
సకలస్థావరజంగమాత్మక జగత్సంత్రాణపాణతా
ప్రకటప్రక్రియవిస్తరించితి విసిన్ భాపితు కోటీశ్వరా॥10

శా. లోకాధీసుడవై సమస్తమునిసుశ్లోకుండవైయుండు నీ
వేకించిజ్ఞునిబాలె బిక్షుకుడవై తేనీకు దాసుండనౌ
నాకీసంపదలేల తుచ్ఛసుఖసంధానంబులేలా భవ
చ్ఛోకజ్ఞానము సద్విరాగమును జాలుంజుమ్మ కోటీశ్వరా

శా. రూకల్ లంచమొసంగలే నతిదరిద్రుండన్నిసంగాంచు వి
ద్యాకౌశల్యము లేదు లేదు తనుదార్ఢ్యంబైన బుద్ధ్యస్థలున్
నాకుంబ్రోవగనింక నేమనుచునిన్నాక్షింతు మోక్షంబు ని
త్యాకారాయికనీవెఱుంగని ప్రమేయుంబెద్ది కోటీశ్వరా॥ 12

మ. జననంబాదినదాది దుష్కృతము లశ్రాంతంబుగావించు మన్
దినముల్ పుచ్చుచు నంటినింతవనుకన్ దేవా భవద్దివ్యమూ
ర్తినినేనెవ్విధిగాంచనేర్తు నధికార్తిన్ కుందగాజాల ని
క నన్నున్ బ్రోవగరమ్ము భక్తజనరక్షాదక్ష కోటీశ్వరా 13

శా. ఇందేయుంటివొ యెందునుంటివో కో నాకీవెందుగాన్పింపవీ
యాందోళంబున బ్రమందెజ్ఞాదముమహాత్మా సత్కృపంబూనియు
స్పందజ్ఞానము నాకొసంగుమిక నేసందేహముల్ లేక యా
నందంబున్ గొని నీదుసన్నిధిని జెందన్ వత్తు కోటీశ్వరా

మ. పరలోకైక సుఖంబునొందుటకునై వాఛించితిగాని త
త్పరతన్ గర్మవయాతిబద్ధుడనునే బంచాగ్ని మధ్యంబునన్
జిరకాలంబుదపంబుజేయగలనా చిద్రూపసర్వేశ నీ
చరణాబ్జంబులనమ్మియుంటినిక మోక్షంబిమ్ము కోటీశ్వరా

శా. సర్వారిష్టము సర్వకిల్బిషవిలాసస్థాన మాద్యంత దు
ష్పర్వాబీజము దుఃఖమూలము మహాపాపానుభూతంబుదు
ర్గర్వోత్కంఠము దేహయాత్రనుబొందనర్పంజాలనొక్కింతయున్
నిర్వాణంబునునాకొసంగుము దయన్ నిన్ గొల్తుకోటీశ్వరా16

మ. నినునిందింపుచు నీకథల్ వినక నీనేతత్వదాత్మత్వముల్
మనమందెంచక నీదుభక్తులను బోలంజూడకే దూఱుచుం
డిన దుష్కర్మధురంధరుండు నరకాబ్ధిం దగ్ధుడౌపోవు నీ
వన సామాన్యుడవా నిజాంఘ్రిగతభక్తాసక్త కోటీశ్వరా17

శా. ఎన్నో జన్మము లెత్తియుంటినిక ముందెన్నెన్ని జన్మంబులీ
తెన్నుం బొందగనుంటినో యెఱుగనో దేవాయికన్ జాలునీ
జన్మంబుల్ బడజాలనన్ను కృపతో బాలింపుమోతండ్రి నీ
కన్నన్ వేరొక దిక్కులేరెవరు లోకారాధ్య కోటీశ్వరా 18

శా. యుక్తాయుక్తవివేచనానుభవసంయుక్తోత్తమజ్ఞానులా
ముక్తిన్ గోరిభవద్వినిర్మలపదాంభోజాత పూజాల
సద్భక్తిన్ దన్మయులై సదానినుమదిన్ ధ్యానింతురోయట్టి
సద్వ్యక్తిన్ నాకునొసంగుమయ్య నినునేబ్రార్థింతుకోటీశ్వరా

మ. భవదీయంబగు పాదపద్మగుల శంభద్భక్తిధ్యానించు ని
త్యవివేకస్ఫురణంబు గాంచగలభాగ్యంబెట్లుచేకూరు బ్రా

గ్భవమం దేనికృతింబొనర్చితినో యుక్తజ్ఞానసంపూర్ణవై
భవముంబొన్నను నేసంగుమయ్యా నినునే బ్రార్థింతుకోటీశ్వరా

మ. జలధిన్ దుర్చ్చగ శక్తి లేదువిషమున్ సాధించియర్పింప
దుర్బలుడన్ జేలముగాగనీకుబులిచర్మం బెట్లు తేనేర్తు
భూషలమై బెట్టెదమన్నగాని ఫణివాసం బెట్టుపోనౌను
బూజలనింకేవిధి సేతు వందనమిదే సైరింపు కోటీశ్వరా 21

శా. ఆషాతాళ వియత్ప్రవృద్ధభవదీయాకారమాద్యంత పీ
క్షోపాయైకరతిన్ హరిద్రుహిణులత్యుత్సాహసంరంభముల్
దీపింపన్ గిటిహంసగూపములబృధ్వీవ్యోమముల్ వ్రచ్చిచూ
పోవన్ జాలక యుండ నేగనుట యెట్లో తెల్పు కోటీశ్వరా

మ. తలపుల్ మీరితి క్షణక్షణంబునకు చిత్తంబొక్కటీరైననుం
గలుషార్తిన్ బడద్రోసి నిత్యసుఖసంధానంబునుం జేయు
నిశ్చలమా నీపదభక్తిపోనడచె నాశాపాశముల్ త్రెంచి
నిర్మలభక్తింబురికొల్పి బ్రోవగదె ప్రేమన్ నన్ను కోటీశ్వరా

మ. వేళక్షైన స్వకుక్షిపోషణకు నేవంబైనకార్యంబు లే
ద్దరగావించి శరీరయాత్రనొకమాడ్కిన్ సల్పుచున్ దానినే
స్థిరమంచెంచి భవత్సహాయమును బ్రార్థింపంగ లేనైతి నీ
శ్వరనామామాహాత్మ్యము బాపినన్నికను బ్రోవన్ రారాకోటీశ్వరా24

శా. అజ్ఞానాంధతమో విశేషముమాయాలీలలంజిక్కి నీ
యాజ్ఞల్ మీరితిమ్రుపాసు ఖంబులకులోనైగర్వమున్ జెంది బ్ర
హ్మజ్ఞులేరని నిశ్చయించితి మదోన్మత్తుండనై యింకనన్
దక్షుంజేసి క్షమించి బ్రోవ గదవే దైవజ్ఞ కోటీశ్వరా

శా. అయ్యా యిమ్మ యటంచు నిన్ను బలుమార్లర్థించి వేసారితిన్
గుయ్యాలింపవి దేలనయ్య భువిదిక్కున్ మ్రొక్కన్ లేనినే
నయ్యా నీకుపరీక్ష జేయు నిది యేమన్యాయమో యయ్యా రా
వయ్యా మొక్కెద నయ్య బ్రోవగదవయ్యా నన్ను కోటీశ్వరా

మ. కరమందున్ గనకాచలంబురజతగ్రావంబు పీఠంబు కి
న్నరనాధుండు సఖుండు కల్పతరుచింతారత్నగోశ్రేష్ఠముల్
స్థిరమైయింటవసింప నేమొసగి తృప్తిం జేతు భక్తాపహృ
ద్వరచిత్తాబ్జయొసంగెదన్ గొనుము మత్స్వాంతంబు కోటీశ్వరా

మ. ఘనమోహాటవిజిక్కి చిత్తము వనౌకంబట్లు కాంతాజన
స్తనశైలంబుల జిందులాడుచు దురాశాశాఖలందూగుచుం
డను జేజిక్కక నాదుభక్తియను త్రాటింగట్టి యాజ్ఞానువ
ర్తినిగా జేకొనుమయ్య మ్రొక్కెదను గౌరీనాధకోటీశ్వరా

మ. తరమే నిన్ను నుతింపభక్తవరదా దైత్యేంద్రుడొక్కండు
దుర్భరమౌఘోరతపంబొనర్చి తనద్వారంబందు గాపుంటకున్
వరమున్ వేడగ బంటువై వెడలి తద్వారంబు కాపుండితీ
వరయన్ భక్తుల పట్టుకొమ్మవనినే బ్రార్థింతు కోటీశ్వరా 29

మ॥ లలితాల్యాన్నసుగంధమాల్య వసనాలంకార సంపత్ప్రభా
కలనన్ భక్తులనెల్లధన్యవిసమేగా ప్రసంబుపెన్ బూదిమై
వలదే గంధము భూషణాళిఫణముల్ వ్యాఘ్రాజినంబంశుకం
బలరన్ గలిగిచరించు నిన్నలవశక్యంబౌన కోటీశ్వరా 30

మ॥ కలనైనం జవరాండ్రగూడ బాలయుల్కల్ దీర్ఘగానైన న
వ్వులకైనన్ దనప్రాణమానధనముల్ పోనంతకష్టంబులే

తలపై గూలగనీయ సత్యమణుమాత్రంబైన రానీక దా
నిలసత్యంబువచించునో యతఁడె నీకిష్టుండు కోటీశ్వరా. 31

మ. తనప్రాణంబున నెంతప్రీతికలదో తద్వంబుగా నట్టి ప్రే
మను జీవంబులనన్నిటిన్ గనుచుసంభావించి దుఃఖింప దా
ననుదుఃఖింపుచు నవ్వ నవ్వుచును దానున్ నవ్వుచున్ శక్తియుం
డినమాత్రంబున సేవ జేయు నతడే నిన్ జూచు కోటీశ్వరా, 32

మ. ఒక కొన్నాళ్లను గ్రిందుమీదెరుగకే నూరేళ్లునా వాడగా
రక మౌ వేషములన్ ధరించి తనుదార్ఢ్యంబంతయున్ గృంగని
న్నిక వాటంబులో తీసిచూచియటుపై నిన్ గంగలో గ్రుంకినన్
సుకృతుండౌనె యనాత్మశుద్ధి యెపుడున్ శోధింప కోటీశ్వరా

మ పుడమిన్ గొందరు పొట్టకూటికయి యేవో వెఱ్ఱి వేదాంతముల్
బడబళ్ళడనుపన్యసింపుచు వచప్రాగల్భ్యతన్ దైవమున్
బొడగాన్పింపక జేతుమంచు జనులన్ మోసంబునన్ ముంతురా
వెడగుల్ చూచిరె నీదురూపమును నేవేళైన కోటీశ్వరా 34

మ. అడియాసల్ బడి పొట్టకూటికయి విద్యాప్రాభవం బందిరొ
వ్వడో తచ్చిత్రవిచిత్రముల్ పలుప వహ్వా యంచు శ్లాఘింతురీ
పుడమిన్ మానవులెట్టిమూఢులో సతంబున్ నీమహత్సృష్టి నే
ర్పడునిస్తంద్రవిచిత్రవైఖరుల దల్పంబోరు కోటీశ్వరా 35

మ. అరిషడ్వర్గగజంబు లుద్ధతిమదీయంబైన హృద్వారిజా
కరమున్ జేరుచు సద్గుణాబ్జముల బోకార్పం దొడంగెన్ బరా
త్పరవానిం దునుమాడుమయ్య గజదైత్యధ్వంసి పీవంచున
క్కరతో వింటిని దిక్కు నీవె సకల లోకారాధ్య కోటీశ్వరా 36

మ. వరగాంభీర్యముగడ్తమై ధృతియె వప్రవ్రాతమై సద్గుణో
త్కరముల్ సైన్యములై నిజేంద్రియములే ద్వారంబులై తావక
స్మరణజ్ఞానమెద్రవ్యమై యలరు నస్మత్స్వాంతదుర్గంబునన్
గరుణం గాపురముండుమెప్పుడను దుర్గాసక్త కోటీశ్వరా. 37

మ. తనకున్ గ్రోధము మంత్రి లోభము ధనాధ్యక్షుండు మోహంబుతం
త్రనియంతృండు మదంబున్యాయపతి మాత్సర్యంబు సేనానిగా
దనరన్ గామవిభుండురాజ్యముగమత్స్వాంతంబు శాసింపుచుం
డెనుగా మారివివాని గెల్చికొనుతండ్రీనీవు కోటీశ్వరా 38

మ. అరయన్ సత్వరజస్తమందుల విప్రోల్లైమూఁడు బెంపొంది దు
స్తరపాపౌఘనిశాచరావృతములై సన్మార్గరోధంబుగా
స్థిరతం గాంచెను నాహృదంతరమునన్ శీఘ్రంబమాయింపుమా
పురసంహారమొనర్చినాడవట యేపుంజూపి కోటీశ్వరా 39

మ. నరుడై పుట్టినదానికిన్ ఫలము సుజ్ఞానామృతాస్వాదనా
పరవశ్యుండయి సత్సధానుచరుడై వైరాగ్యసంప్రాప్త సౌ
ఖ్యరతుండై భవదీయభక్తుడయివీకన్ ముక్తికాంతామనో
హరుడౌటేకద తత్ఫలంబుదయ సేయన్ రాదె కోటీశ్వరా 40

మ. చిరకాలంబుననావిశుద్ధహృదయక్షేత్రంబునన్ బుట్టియున్
దురితారణ్యము బాఁగుగా బెరిగి యెంతో భీకరంబయ్యె సు
స్థిరమయ్యెన్ బరమేశ దానినిక భస్మీభూతమున్ జేయుమా
కరుణన్ నీదగుపాలనేత్రదనమున్ గల్పించి కోటీశ్వరా 41

మ. అణువై నన్ బరమాణువైన భవదీయాకార రేఖావిచా
రణపాత్రింబగు నిన్ను జూడగల మార్గంబెద్దియో చూపి కా
రణభూతాత్ముడవైన నీదరిని జేరంగల్గు దీక్షా విచ
క్షణమున్ నాకునొసంగుమయ్య నినునిచ్చల్ గొల్తు
కోటీశ్వరా 42

మ. భవదీయంబగువిశ్వరూపమునుసంభావించుమహాత్మ్యంబమున్
భవదీయంబగు నామసంస్మరణమొప్పంజేయువాక్చాతురిన్
భవదీయంబగు సన్నిధానమున సేవల్ చేయు సద్భాగ్యమై
భవమున్ నాకు నొసంగుమయ్య నినునేప్రార్థింతు
కోటీశ్వరా. 43

శా. పానీయంబులుగ్రోలుచో మెసవుచో వ్యాపారముం జేయుచో
నానాభోగములందుచోదలచుచో నైపుణ్యముంగాంచుచో
జ్ఞానానందమునందుచో సకలసంస్కారంబులం బొందుచో
నీనామస్మరణంబు సేతునిక దండ్రీబ్రోవు కోటీశ్వరా 44

మ. కలవో లేనివో కొన్నికొండెములసాక్షాత్కార మానట్టులన్
బలుకుల్ దేనియలొల్క భూభుజుకడన్ బల్ మెప్పుగాజెప్పిలో
కులకొంపల్ దెగముంచిన స్సైనకుదక్షుల్ లేరటంచున్ మహా
బలగర్వంబున విర్రవీగినిను దల్పన్ లేను కోటీశ్వరా 45

మ. దయశోరమ్మని చేగబిల్వదలకున్ దాడెక్కినక్లిక్కని
ర్భయులన్ సర్వము తానకాదలచి గర్వప్రాభవోపేతదు
ర్ణయవృత్తిన్ విభుమోసగించి బహుళార్థగ్రాహియైనక్కరీ
తిరుకాంక్షించెడుద్రోహిఘోరనరకార్తిన్ గ్రుందుకోటీశ్వరా

మ. పరసౌఖ్యంబునకోర్వలేక దురితస్వాంతంబునన్ బద్ధమ
త్సరముం బూనితి యుక్తులం గలిపి మిత్రద్రోహముల్ జేసి యె
ల్లరకుం గంటకుఁడై ధనార్జనకుఁ గాలంబుం వృథాపుచ్చి భూ
సురు తామాత్రము పుణ్యమిచ్చునె ముముక్షుల్ మెచ్చ
కోటీశ్వరా 47

మ. స్తవనీయంబగు విద్యనేర్చి సుకవీంద్రస్తుత్యుడై సర్వశా
స్త్రవిరాజద్ధిషణాపరుండయి జగచ్చక్రంబు లల్లాడఁజే
సి విధిం డీకొని సృష్టికెట్లా ప్రతిసృష్టిం జేయు లోకైకవీ
రవరుండుం నినుగొల్వకున్నగను డౌర్గత్యంబు కోటీశ్వరా 48

మ. పరమార్థంబన నెట్టిదో యెఱుగ సంపద్యోగ సంరంభదు
స్తరగర్వంబున దీనపోషణ పరత్వంబన్న నే నొల్లకే
పరులం గాసిలఁబెట్టి హింసలను జెప్పం రాని వే జేసితిం
దురితంబిప్డు ఫలించె బ్రోవుమిక గొల్తుం నిన్ను కోటీశ్వరా 49

మ. ఒక రాజన్యుననుగ్రహంబునకె యెన్నో కష్టముల్ పొందిమా
యకులౌ మంత్రులయొద్ద పుల్లలకులోనై తప్పలం బాఁద జా
లక యున్నప్పుడు నీదుమాయఘనజాలంబై తగుల్కొన్నలో
గక నీదివ్యపథంబు జేరుటకు శక్యంబౌనె కోటీశ్వరా 50

మ. జననీగర్భములోననున్న తఱి నే చందంబునం నిన్ను నె
మ్మనమం దెంచితినో యెఱుంగనిక జన్మంబెత్తినా శైశవం
బున నెబ్భంగి దలంచియుంటినో కానే మూర్ఖుండనై బాల్యమం
దున సేవింపగలేదు బ్రోవగదె గొల్తుం నిన్ను కోటీశ్వరా 51

మ. నవకంబౌ నెఱజవ్వనంబు పయికొన్నన్ గీర్తి కాంతావిచి
త్రవిలాసానుభవప్రదంబగుకళాధన్యత్వమున్ గాంచుచో
భవదీయంబగు సేవలన్ మరచితిన్ భ్రష్టుండనైతిన్ దయా
ర్ద్రవిభూతిన్నెలకొల్పి బ్రోవుమిక నిన్ ధ్యానింతు కోటీశ్వరా 52

మ. తమనిల్పోపమిభండ్లియాడి యొకకాంతన్ గొంతకాలంబుని
త్యముతద్భోగపదానుభోగినై యంతన్ సంతతిం గాంచియా
మమకారమ్మున నేకుటుంబమును సంభాళింపనెన్నన్ని యా
శ్రమలం గుందుచు నిన్ను గొల్వనయితిన్ సద్భక్తి కోటీశ్వరా 53

మ. తనువా డెస్సెను నాడులున్ సడలె దంతెంబుల్ దిగంజారెజ
వ్వనమున్ మాసె బలంబుడీసె జరయుంబ్రాపించె మాద్యంబుపై
కొనెదౌర్బల్యము పాపభీతియొవణంకున్ గొల్పినన్ గ్రుంగజే
సెను సేవింపగజాల వందనమిదే చేకొమ్ము కోటీశ్వరా 54

మ. ధనధాన్యాదిసమస్త సంపదలనొందన్ గోరసౌందర్యభా
జనమౌరూపముగోర సర్వసుకళాసౌభాగ్యమున్ గోర న
మ్మనమందెప్పుడు నిన్ను గాంచగల శుంభజ్జ్ఞానవైరాగ్యచిం
తనమే కోరితి నాకొసంగుమిక దద్భాగ్యంబు కోటీశ్వరా 55

మ. తలిదండ్రుల్ సుతులున్ సతుల్ హితులు భృత్యవ్రాతముల్
హెచ్చుగా
గలరంచున్ గులకంగ జూతు నిహలోకంబందు మృత్యుగ్రహా
నలకీలాహతినొందు వేళనొకరైనన్ వెంటరాబోరు ని
స్తులమాదిక్కిక నాకు నీవెగద గొల్తున్ నిన్ను కోటీశ్వరా 56

మ. ఇలలో నెచ్చటనో విపత్తులుగలా రెబ్బంగి నాశత్రుపీ
డలబోకార్చెదనంచు జూతు మరియేరుంగాగు నాయింద్రియం

బులెనాశత్రువులయ్యో వానినిక నిర్మూలంబొనర్పంగ ని
శ్చలవైరాగ్యకృపాణమిమ్ము సినునిచ్చల్ గొల్తుకోటీశ్వరా 57

మ. అనుభూతంబగుతుచ్ఛ భోగములపైనాసల్ విసర్జించి సే
వనమందుల్ మునివృత్తిలేక తమదేవాసీపదధ్యానముల్
మనమందుల్ నెలకొల్పి మోక్షపదసామ్రాజ్యంబునొందంగ బు
ద్ధివినా కెట్టులనుగ్రహింతువొకో నేడేనీవు కోటీశ్వరా 58

మ. కలశాబ్ధిల్ మథియింప బుట్టినవిషోగ్రజ్వాలలోకంబులల్
గలచల్ దద్విషముల్ దయాపరత మ్రింగం బోయిలోనాజగ
ద్వ్యాలయంబుల్ నశియించునంచువిసమంతల్ గంఠమందాపి ప్రా
ణులరక్షించిననిన్నుగొల్తు కరకంఠుండంచు కోటీశ్వరా 59

మ. సరసంబైనపదార్థముల్ గలిగిభూషల్ వేషముల్ గల్గి సు
స్థిరమౌసంపదలుండగల్గి సదసద్వ్యేత్వల్ సుతుల్ గల్గి రూ
పరియౌభార్యయు గల్గియేమరచినిల్ ప్రార్థింపనేమో దయా
పరనిన్నేమరనట్లు జ్ఞానమిడి బ్రోవంజూడు కోటీశ్వరా 60

మ. కులగోత్రంబులు కావు దివ్యతటినీకుల్యాదులుల్ గావు సు
స్థలముల్ గావుయశంబు గూర్పగలవిద్యల్ గావుమోక్షంబుసం
ధిలుమార్గంబులునీవిశుద్ధభజనోద్రేకంబులౌ గాన ద
తులనంబుల్ దయసేయుమయ్య నినువేడల్ గొల్తుకోటీశ్వరా 61

మ. రవియొక్కండె మయూఖజాలములబర్వంజేసిలోకావృతాం
ధవినాశంబొనరించియెల్లరకు ప్రత్యక్షంబవై వెల్గగా
భవదీయంబగు కోటిసూర్యనిభరూపంబెచ్చటన్ డాగె నా
యవివేకాంధము బాపిముక్తి దయసేయంగారాదె కోటీశ్వరా 62

శా. రేపో మాపో నశించు నీతనువు పేర్మిన్ సుస్థిరంబంచు నా
శాపాశంబుల జిక్కి పాపినయి దుష్కార్యంబులన్ జేసితిన్
దాపైవచ్చు గృతాంత ఘోర నరక ద్వారంబులు గ్రొంబులై
యాపన్నార్తిహరా యటంచు నిను నేనర్థింతు కోటీశ్వరా 63

మ. మొదటన్ వ్రాసిన వ్రాతపై మరల దుష్పుల్ పెట్టి వ్రాయంగనీ
మదిలో బద్ధకమో యసత్యభయమో మానింపవే నేకాని నీ
పదపద్మంబుల బట్టి వీడవిభవద్భక్తాళి రక్షించితే
యుద్దిపై దానికి హెచ్చులెచ్చు తెలుపంగా రాదె కోటీశ్వరా 64

శా. పాపంబుల్ ఫలియింపకుండునని నేభావించితిన్ దైవమా
ప్రాప్తించెన్ గదతన్మహానల ఫలంబత్యంతమై నామన
స్తాపంబేమని తెల్పుకొందు నికబశ్చాత్తాపమున్ జెందితిన్
నాపై కోపము వీడి బ్రోవగదవే నాతండ్రి కోటీశ్వరా 65

మ. రమణీయంబగు నీజగద్వలయమే రంగస్థలంబా బ్రపం
చము నానాటకమందు నీవు నరవేషంబుల్ ప్రకల్పించిని
త్యము తన్నాటక సూత్రధారివయి మిథ్యా చిత్రముల్ జూపుచున్
బ్రమదంబేర్పడ నాటలాడెదవు దేవా నీవు కోటీశ్వరా 66

మ. సుకమెందో కలదంచు యోజనలొలక్షల్ మీటి గొంతెమ్మకో
రికలన్ ముస్గని రాశ జెందికడు నార్తింగుందు విద్యుత్క్షణా
ధికతన్ గాంచవలంచు మృత్యువనభీతిం జెందు హృద్బ్రాంగమీ
వికనద్దానిభవత్ప దాబ్జములయందే చేర్పు కోటీశ్వరా 67

మ. తెలవారంగనె మేలుకొల్పి యెవడే తీరంది వర్తింపగా
వలెనో ప్రాణులకట్లు తత్తదుచిత వ్యాపారముల్ కూర్చి జీ

పులకర్మార్జితమౌ శుభాశుభము లే ప్రొద్దున్ విలోకించి త
త్ఫలపాకంబొడగూర్చు నీ ప్రభుతకెవ్వండో పుకోటీశ్వరా 68

మ. వినుదాగొప్పగజెప్పుకొంటి యనుమంతల్ వింతగా దోపకల్
తినదేశంబును దన్నివాసజనులన్ దద్దేశసద్వస్తువుల్
దనదైవంబన లేశమైన నభిమానంబున్ మదిన్ లేనివా
డునినుం దానెటుగొల్చిముక్తిగొనువాడో తెల్పుకోటీశ్వరా 6

మ. తమగుట్టున్ వెలిబెట్టునంచుముఖమంతంబూదితో గప్పిని
క్కము లోడాగకపైకిబొంగు ననుశంకన్ వక్షమందక్షుహా
రములన్నింపి త్వదీయభక్తులగ నర్థప్రాప్తికై మాయవే
షములన్ బన్నిహితైక భాషలమన ష్యాశ్రేణిగన్ జాత్రిమిత్రు
ద్రమతుల్ భక్తులపేర్లు చూపెదరువింతల్గా వెకోటీశ్వరా 70

శా. ధీరస్వాంతులు సద్వ్రతాన్వితులు ముక్తిప్రాభవాసక్తులై
తోరంబై నతపంబు సల్పెదు ముసిక్షోమంబు యత్నించిరెం
తోరమ్యంబగు నీమహాత్వకల మాధుర్యత్వమన్ గాంచగా
వేరే నేనెటునిన్ను జేరి గలకల్మింగాంతు కోటీశ్వరా 71

శా. విద్యల్ గొంతగడించి తానొకమహావిద్వాంసుడే యంచుస్వ
లోప్పదోగ్యంబునముండి తానొకడెధన్యుండంచునామ్నాయ సం
వేద్యుంగాంచియు నైనలెక్కగొన కుర్వింగర్వయాసర్వ వి
ద్వద్యూథపరికూలుడెట్లునిను సంభావించు కోటీశ్వరా. 72

శా. పాపం బెయ్యదొ పుణ్యమెయ్యదొ కళాపారీణులౌ వారిచే
రూపింపంబడు ధర్మశాస్త్రము లనే లోకమ్ము దుర్గాని నా
కేపంచం గనుపట్టనట్టి విటులింకేనమ్ము టెట్లంచు దు
ష్టోపాయంబని మోసపోతి నను ధన్యుంజేయు కోటీశ్వరా 73

శా॥ మన్నుస్ దిన్నునుగాన కేనిరత దుర్మార్గప్రచారుండనై
యెన్నాళ్లీగతి దుచ్ఛసంస్మృతి మహాపేక్షం విసర్జింపనో
తెన్నుంగానక కష్టసంతతుల నెంతేమ్రిదంగా నేర్తునా
యన్నా కర్గన్న ననిన్న జేరగల భాగ్యంబిమ్ము కోటీశ్వరా॥74

మ॥ అరిరాటానః పీతిహెచ్ఛాత్రు డయిభూమ్యాకాశముల్ పట్టుని
ర్భరతన్ దాశము వేయగల్గి నిరతప్రద్యోత సత్కీర్తియై
ధరణీందుప్రిడంబ సర్వభోగముల జెందంజాలియుఃన్నీ పదాం
బురుహద్వంద్వముగొల్వకున్న నరకంబుంజెందుకోటీశ్వరా75

శా॥ స్వాతంత్ర్యంబును బాసియొక్కరుని పజ్జంజేరితన్మానస
ప్రీతింగూర్పగ దప్పుసాక్ష్యముల మేర్మిన్ జెప్పుచున్ సత్యవా
గ్రీతిన్ మాని ధనంబుగూర్ప గలవారిన్ మెచ్చుచున్ సజ్జన
వ్రాతంబున్ నిరసించువాడు గనుదార్గత్యంబుకోటీశ్వరా 76

మ॥ నినునర్చించక నీకథల్ వినక యంతేనీమహాత్వంబు నె
మ్మనమందెంచక నీస్వరూపము నుతింపన్ రాక నీనామ కీ
ర్తనమున్ జేయకిహంబునందుసుఖమొందంజూచువారుండు కం
టెనుబట్టంగనె వెంటజచ్చుటయునంతే మేలుకోటీశ్వరా॥ 77

శా॥ నానాయోనుల బుట్టిపుట్టితుదకున్ జ్ఞానన్యూనాత్ముండనై
నేనీ మానవజన్మమెత్తితినిగానీ మాయభోజిక్కుత్రి
ద్ధానై పుణ్యము భక్తిమార్గమునుజెందన్ జాలకుంటిన్ భవ
ద్ధానానంద మొసంగి బ్రోవగదె చెంతన్ జేరి కోటీశ్వరా॥78

మ॥ ధనసంపాదన కన్యులన్ గొలిచి చేతంబందునీర్ష్యాగ్రహం
బునుసందించి రజస్తమోగుణములన్ బూజించిదైవంబులే

డనుభావంబున సంచరించితిని దేవాతత్త్వలంబిత్త శ్రీ
గననయ్యెఁ భవదీయపాదములగాంచఁ గొల్తుకోటీశ్వరా 79

మ॥ అవనిఁ దుర్వ్యసనానుభూతనుగుదేహాప్తాశివాంచే సదా
ప్రవసింపంబని కండలఁ జెడిచివస్త్రాదన్ కితాబందిమి
త్రివితానంబానరించు సన్నుతుల జెందఁ జాలితిన్ గాన మృ
త్యువువాతఁ బడనుంటినంచెఱుగ గొల్తున్ బ్రోవు కోటీశ్వరా

మ॥ ధరణీచక్రముగిర్రుమ్రుచుదనకై తాదిర్గుచున్ వేగ బా
స్కరుసింగొల్వఁ బ్రదక్షిణంబునను వేడ్కన్ సల్పుచున్ గాలవై
ఖరిసిఁ మార్చి శుభాశుభంబుల సదా కావింపగా గారణం
తరమీవేయని నమ్మికొల్చెదను జ్ఞానంబిమ్ము కోటీశ్వరా॥ 81

మ॥ రవియొక్కండెసమస్తలోక ములబర్వం జేయుచున్ వెల్గులఁ
వివిధాదర్శములన్నిటఁ బ్రతిఫలాప్తిం గాంచుచున్నట్లు మా
ధవనీవొక్కడ వేజనాళి హృదయాం దర్శమ్ములఁ నిల్పుచి
త్రవిధానంబును నాకు దెల్పుమికఁ బ్రార్థింతుకోటీశ్వరా 82

మ॥ తనగర్భంబుననుండితంతువుల వింతంగొల్ప గల్పించియుం
తనిశాంతంబాక దానిగూర్చియట గొన్నాళ్ళుండియాపై నిమ్మఁ
తనునిర్మించినదాని లూతమెటు మోదంబాప్పభక్షించిలో
గొను నోతధ్విధ మీవు లోకముల బెక్కుల్ గూర్చి ప్రేమించినా
శనమొందించెదవట్టినీ మహిమ లెంచఁ లేము కోటీశ్వరా॥ 83

మ॥ తొలిజన్మంబున నేనొనర్చిన యఘస్తోమంబె యీజన్మమం
దలఘుజ్ఞానవిహీను జేసె నను దేవా నేఁ బునర్జన్మబా

ధలనింకెట్లుధరింపజాలుదును సత్యజ్ఞానముఁ గూర్పుమా
తలపఁ జాలను వేఱెదేవతల నెంతఁ దండ్రి కోటీశ్వరా ॥84

మ॥ మలినంబైనమలమూత్రపూరితము నేమాంసాస్థియుగ్మంబునై
తలపఁ రానియసహ్యమై బహుళసంతాపంబు నుఁగొల్పు కాం
తల మేనుల్ దిలకించి నంతనెమనోజ్ఞత్వంబు గల్పింతు ప్రా
జ్ఞులెతన్మోసమునందకుండునటునను న్బ్రోవు కోటీశ్వరా॥85

మ॥ మునుజన్మంబులనెత్తి నప్పుడు భవత్పుణ్యస్వరూపంబు గో
ల్పనిపాపంబున నాకుగష్టములు సంప్రాప్తించె నీజన్మమం
దునగానఁ భవదీయనామమును జేతోవీధిగొల్తుఁ బున
ర్జననంబీయకుమయ్య భక్తజనరక్షాదీక్ష కోటీశ్వరా 86

శా॥ కన్నుల్ గల్గినభాగ్యకారణమున న్నన్నించునీచిన్నెలున్
విన్నాణంబును నాదిగాఁ గలుగు నీవిశ్వంబు శశ్వద్గతిఁ
గన్నుల్ మూసుకయున్న సర్వమును బూర్ణంబైనబింబాకృతిన్
గొన్నట్లుండును నీవిచిత్రమును నాకుం దెల్పు కోటీశ్వరా॥ 87

మ॥ అనుబూలంబగు శైశవంబరుగుబాల్యంబేగునాపై నయౌ
వనసామ్రాజ్యముబీటువోవు బిదపన్ వర్ధిల్లు కౌమారమున్
జనువృద్ధత్వమువచ్చు మిత్తివలెనీజన్మంబుచాల్ చాల్ పున
ర్జననం బేటికినాకునిత్యసుఖమున్ సంధింపు కోటీశ్వరా 88

శా॥ భూమీచక్రము స్యందనంబుగనభంబున్నీకపర్ధంబు
స్వామీదిక్కులు కట్టుపుట్టములుగావర్ధిల్లునీవున్నతా

వేమూలంగలదంచు నెంతునిక నాకీభావముం దెల్పుచున్
బ్రేమంజూడుము నీవు మ్రొక్కెద భవానీనాధకోటీశ్వరా 89

మ॥ కలలందోచెడు భోగభాగ్యములపై గాంక్షన్ విసర్జించున
ట్టిలలో నస్థిలసంపదుత్కరముపై నేహ్యంబు సంధించు జ్ఞా
నలతాబీజము నాటుమయ్య సుమనోజ్ఞంబైన హృక్షేత్రము౹౹
దలుక౯ వీడి మదీయపాపముల బాయం జేసి కోటీశ్వరా॥ 90

శా॥ ఆద్యంతంబులు లేక భాసిలుచు సర్వాత్మస్వరూపుండవై
చిద్యాంగంబొనరించు వారలకు స్వస్థిన్ గొల్పుచున్ మోక్ష సం
పద్యోగంబు లభింప జేయగల సామర్థ్యంబునన్ గాలునీ
యుద్య౯న్మూర్తిసి నాకు జూపినను ధన్యుం జేయు కోటీశ్వరా 91

శా॥ నిత్యానిత్యపదార్థభావనకళానిర్ణిద్రితన్ గాంచినీ
సత్యాకార మనిత్యవస్తువని విశ్వంబెల్ల మిథ్యైకదా
గత్యంబొందినదంచు నైహిక సుఖవ్రాతంబు వర్జించు నా
న్నత్యజ్ఞానము నాకొసంగుమిక బాతంబేల కోటీశ్వరా॥ 92

మ॥ జననంబందిన ద్వాదిదుష్కృతముల శాంతంబు గావింపుచు౯
దినముల్ పుచ్చుచునుంటి నింతదనుక౯ దేవా భవద్దివ్య మూ
ర్తిని నే నెవ్విధి గాంచ నేర్తు నధికార్తిం గుందగా జాలచిం
కననుం బ్రోవగరమ్ము భక్తజనరక్షాలోల కోటీశ్వరా॥ 93

మ॥ కలలో సన్నిభమా ప్రపంచమును వీక౯ సుస్థిరంబంచు ని
ర్మలమై నిశ్చలమైన నిర్గుణపరబ్రహ్మంబ వౌసి మహా
జ్వాలరూపంబున సత్యవస్తువని యజ్ఞానుండనై యెంచితి౯
గలకైలాసనివాసని౯ గొలుతు మోక్షంబిమ్ము కోటీశ్వరా ॥94

మ॥ చదువుల్ నేర్చిన దానికిన్ ఫలము సత్సాంగత్యమున్ గల్గి స
త్యదయాశాంత గుణోన్నతుండయి భవత్పాదాబ్జముల్ గొల్చుటే
కద తద్ధర్మము మానిసాధువులపై గౌటిల్యతన్ రంధ్రముల్
వెదుకంజూచెడు పాపికెట్టిగతి నుర్విం గల్గు కోటీశ్వరా॥ 95

మ॥ తులలేనట్టి సుఖంబు గల్గుటకు హేతుర్భూతమౌ నిర్మల
స్థలమొందొక్కల దంచు నెంచితి నిసాంతం బెట్టిదో సుంతయున్
దెలియంజాలక దేశదేశములనెంతే దిర్గుచున్ వేడ్కను
య్యేలబిడ్డందుచునుండనూర్ధిరుగులాగైనట్లు కోటీశ్వరా॥ 96

శా॥ శ్రీశైలాసనగాధివాససకలోర్వీచక్రసంతాపిణ శీ
లాకారుణ్యమయాంతరంగమునిలోలాభక్త లోకైకపా
కాకల్యాణగుణాల వాలనుతలీలానేత్రసందీప్తపా
లాకల్పాంతక నీలకంఠ పరమాత్మా దేవ కోటీశ్వరా॥ 97

మ॥ తననెంతో నొకజ్ఞానియంచు జనులత్యంతంబు భావింతురం
చు నిజాచారమునందు బెట్టకయె తజ్జంబో లెక్కిరంగనీ
తినికాయంబులబల్కుచున్ బరులగోతింద్రోసి పైనుండిన
ప్పునతండెన్నటికైన నీదయకు బాత్రుండౌనె కోటీశ్వరా॥ 98

మ॥ తెరచాపల్ గణియింపనింద్రియములీ దేహంబెయానావ దు
ష్కరమైనట్టి ప్రపంచమబ్ధి సుఖదుఃఖంబుల్ తరంగాళి సం
సరణాయత్త విమోహమే తలప ఝంఝామారుతంబౌను నే
ర్పరివౌ నీవట కర్ణదారుడవు దేవాముక్తి తీరంబునన్
ద్వరలో జేర్పుము నిన్ను గొల్చెదను జిత్తంబందు కోటీశ్వరా॥ 99

మ॥ బలుపెక్కన్ సమరప్రధానవిజయ ప్రస్ఫూర్తిలేదింక నా
సలు దుర్గాలము చిక్కఁజేసినను దీక్షింబౌ తపోవృత్తి నే
వలవాసింక తల్లిదండ్రి గురు నాస్తత్రైశ్రీ నీవంచు నీ
యలచే ద్రెళ్ళగముక్తిమార్గమిడిడాయుంజేస్తుకోటీశ్వరా॥100

శ్రీ కోటీశ్వర శతకము
సమాప్తము.



